# చరిత్ర కథలు

[నాల్గవ భాగము]

రచన:

శ్రీ వండూరి విఠల్‌బాబు, బి. ఏ.,




ఉమా పబ్లిషర్సు

విజయవాడ-1.

వెల: [redacted] [redacted]
రూ 1-50 పైసలు



ఇందులో...

★ మిహిరకుల

★ హర్షవర్ధనుడు

...కలవు

ద్వితీయ ముద్రణ 1958

గీతా ఆర్టు ప్రింట

# తొలిపలుకు

నేటి ప్రాథమిక విద్యా విధానంలోని, చరిత్ర బోధనా పద్ధతిని సంస్కరించవలసిన అవసరం నాకు కనిపించింది. కేవలం తారీఖులతోనూ, వంశానుక్రమణ పట్టికలతోనూ, చరిత్రను నింపటంకంటె - ముఖ్యంగా ప్రాథమిక విద్యార్థులకు - కథారూపంలో చరిత్ర పురుషుల జీవితాలతో ప్రారంభించి, చరిత్ర రచన సాగించటం ఎక్కువ ప్రయోజనకరమనే విశ్వాసంతో ఈ రచన కొనసాగించాను.

ఆంధ్రులకు ముఖ్యంగా, విద్యార్థులకు, ఇతోధికంగా మన చరిత్రపై ఉత్సాహాసక్తులు రేకెత్తించటమే నా ప్రయత్నంలోని ప్రధానాశయం.

చరిత్ర పురుషుల జీవిత గాథల సంపుటే, ఏ దేశమునకైనా చరిత్ర అవగలదు గనుక, మన చరిత్ర పురుషులను నాయకులుగా స్వీకరించి, ఈ చరిత్ర వ్రాయుచుంటిని.

కాగా మన చరిత్ర పూర్వభాగం గురించి, తగినన్ని ఆధారాలు మనకు లభించటంలేదు. అనేక చారిత్రకాంశములపై, పరస్పర విరుద్ధమైన విభిన్నాభిప్రాయములు గోచరించుచున్నవి. వీటన్నింటినీ చర్చించుకొనుచూ మీ మనస్సు చీకాకుపరచుటకంటె, ఎక్కువ ఆధారములుగల విషయములనే ప్రాతిపదికగాగొని, రచన కొనసాగించుట న్యాయమనిపించింది.

ఈ ప్రయత్నంలో అనేక అమూల్యమైన సలహాలనిచ్చి, ప్రోత్సహించి, ఆశీర్వదించిన విజయవాడ S. R. R. & C. V. R. కళాశాల చరిత్ర శాఖాధ్యక్షులు, పూజ్యశ్రీ చతుర్వేదుల రామనరసింహం గారికి నా కృతజ్ఞత తెలుపుకొంటున్నాను.

2—5—57
విజయవాడ

నండూరి విఠల్‌బాబు.

# ప రి చ య ం



చిరంజీవి విఠల్ రచించిన చరిత్ర సాకల్యముగా చదివితిని. మన తెనుగు భాషలో ఇంత చక్కని చరిత్ర ఇంతకు ముందు వెలువడలేదు. ఇది అత్యుక్తిగాదు.

మొదటినుంచి చివరవరకు పాఠకులకు రవ్వంతయైన విసుగు జనించకుండా చక్కని శైలిలో ఈ యువకుడు 'మన చరిత్ర' రచించి, తెలుగులకు ఎనలేని సేవ చేయగల్గెను.

మన చరిత్రపై ఆసక్తిగల పాఠకులకు దాని నభ్యసింపవలసిన విద్యార్థులకు ఇది మిక్కిలి ప్రయోజనకరముగా నుండును.

యువ రచయిత విఠల్ వయసున పిన్నవాడైనను, రచనా వ్యాసంగమున దిట్టయని నిరూపించుకొనినాడు. చిరంజీవికి నా ఆశీస్సులు.

3—5—57
విజయవాడ.
S.R.R. & C.V.R.

(Sd) చతుర్వేదుల రామనరసింహం,
S. R. R. & C. V. R. కళాశాల
చారిత్ర శాఖాధ్యక్షులు.

# మిహిరకుల

చరిత్రలో ప్రసిద్ధినొందుటకు రెండు మార్గములు గలవు. మహోన్నతములైన జీవితముల గడపి, మహోజ్వల చరిత్ర సృష్టించువారు కొందరు. మహోపద్రవకరమైన జీవితముల గడపి చరితార్థత సాధించువారు కొందరు. 'మిహిరకులుడు' ఈ రెండవ తరగతికి చెందిన మహానుభావుడు.

క్రూరత్వమున గాని కృతఘ్నతలో గాని ఈతని మించిన ప్రభువు మనకు కనిపించడు. ఇంతటి రక్తపిపాసి గాని, నీచుడుగాని భారత దేశము నెన్నడును పరిపాలించ లేదు. ఈతడు హూణులను ఆటవిక, అనాగరిక జాతికి చెందినవాడు.

ప్రపంచమునకు మహోపద్రవముగా పరిణమించి, అటు గ్రీకుసామ్రాజ్య వినాశనమునకు, ఇటు గుప్తసామ్రాజ్య నిర్మూలనమునకు దారితీసిన ఈ హూణులను గురించి కొంత తెలుసుకొందము. వీరు మధ్యఆసియాలోనూ, చైనా వాయవ్యతిని యునన్నూ నివసించు[illegible] సామ్రాజ్యమునకు వచ్చెను. అప్పటి హూణసామ్రాజ్యము గొప్ప దశలో నుండెను. హిరట్‌లోని బామిన్ అను నగరము వీరి సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణముగా నుండెను. హిందూదేశమును నాడు పరిపాలించిన రాజులలో మిహిరకులుడు మహాబల సంపన్నుడు. అతని పేరు తలచినంతనే నాటి ప్రజలను విపరీత

బ్దమున విజృంభించి, మొదట పర్షియా భూభాగముపై దండెత్తిరి. అప్పుడు పర్షియాను పరిపాలించుచున్న పాపుర్ అను చక్రవర్తి వీరినెదిరించి పారద్రోలగల్గెను.

ఆ తరువాత సిరిసంపదలతో పాడి పంటలతో తుల తూగుచు మహావైభవము ననుభవించుచున్న భారత దేశముపై వారి దృష్టిపడినది. తండోపతండములుగా, గొర్రెల మందవలె వీరు భారత దేశమున జొరబడిరి. హూణులు మహా వీరులు. భయంకరమైన క్రూరులు. ఒక్కమాటలో వీరు మానవులుకాదు, రాక్షసులు. అప్పుడు భారతదేశమును కుమారగుప్తుడు పరిపాలించుచుండెను. హూణుల దండయాత్రలతో గుప్త సామ్రాజ్య సౌధపునాదులు కదలిపోయినవి.

క్రీ॥ శ॥ 445 లో కుమారగుప్తుడు మరణించెను. ఆ తరువాత అతని కుమారుడు స్కంధగుప్తుడు రాజ్యమునకు వచ్చి హూణుల నోడించి దేశమునుండి పారద్రోలెను. క్రీ॥ శ॥ 470 లో హూణులు తిరిగి భారత దేశముపై బడిరి. గాంధారను, పంజాబు వాయవ్య భాగమును ఆక్రమించుకొని ఆ తరువాత అయిదు సంవత్సరములకు స్కంధగుప్తుని రాజ్యముపై బడిరి. కాని ఈ పర్యాయము హూణుల ధాటికి స్కంధగుప్తుడు నిలువలేకపోయెను. హూణులపై దండయాత్ర సాగించుటకు అశేష ధనరాసులు వెచ్చించవలసి వచ్చినది. ధనాగారమంతయు ఖాళీయైపోయినది.

స్కంధగుప్తుని పిదప మూడవసారి తిరిగి హూణులు గుప్తసామ్రాజ్యముపై బడిరి. ఈ దండయాత్రిలలో గుప్త సామ్రాజ్యమందలి వాయవ్య భాగమంతయు హూణుల వశమై పోయినది.

ఈ హూణులకు తోరమాణుడనువాడు నాయకుడు. ఆతడు మధ్యభారతమంతనూ జయించి, మాళ్వాపై తన యధికారమును స్థాపించెను. అతని కాలమునాటి వెండి నాణెములబట్టి ఉత్తర భారతమున అధిక భాగమాతని కధీనమై యుండెనని చెప్పవచ్చును. గ్వాలియర్ నుండి పంజాబునందు గల సాల్ట్ రేంజి వరకు ఆతని నాణెములు దొరికినవి. కాశ్మీరము గూడా తోరమాణుని సామ్రాజ్య భాగముగా నుండెనని కొందరు చెప్పుదురు. తోరమాణుడు భారత సామ్రాట్టు వలె మహారాజను బిరుదు వహించెను. భానుగుప్తుడు, వల్లభి రాజ్యాధీశుడు, ఇంకనూ అనేక స్వదేశ రాజులు తోరమాణునికి కానుకల బంపిరి.

తోరమాణుడు క్రీ॥ శ॥ 510 ప్రాంతమున మరణించెను. అతని యనంతరము మిహిరకులుడు రాజ్యమునకు వచ్చెను. అప్పటి హూణసామ్రాజ్యము గొప్ప దశలో నుండెను. హీరట్‌లోని బామిన్ అను నగరము వీరి సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణముగా నుండెను. హిందూదేశమును నాడు పరిపాలించిన రాజులలో మిహిరకులుడు మహాబల సంపన్నుడు. అతనిపేరు తలచినంతనే నాటి ప్రజలను విపరీత

మైన భయభ్రాంతులు కలుగుచుండెడివట! ఈతడు పంజాబులోని సకాల అను పట్టణమును రాజధానిగా చేసికొనెను.

భయంకరమైన రక్తపిపాసతో మిహిరకులుడు చేయుచున్న స్వైరవిహారమును సహింపలేక, మగధరాజు బలాదిత్యుడు తోటి స్వదేశరాజులతో సంప్రదించి మిహిరకులు నెదిరించుటకు ఒక కూటమిని తయారు జేసెను. ఇందు మధ్య ఇండియాను పాలించుచున్న యశోధర్ముడు గూడ ప్రముఖ పాత్ర వహించెను. వీరు సైన్యముల గూర్చుకొని క్రీ॥ శ॥ 528 లో ఉమ్మడిగా మిహిరకులు నెదిరించిరి.

ఈ యుద్ధమునందు భారతీయ సైన్యములు ప్రాణములకు తెగించి పోరినవి. 'విజయమో స్వర్గమో' యను నినాదముతో ప్రాణముల తృణముగా వర్జించుచు, భారతీయ సైన్యములు హూణులనోడించి, విజయభేరి మ్రోగించగల్గినవి.

బలాదిత్యుడు ఒక్క వ్రేటున మిహిరకులుని శిరస్సు ఖండించతలచి గూడ, జాలినొంది యాతని సగౌరవముగా మాతృదేశమునకు బంపెను. అన్నకు సంభవించిన దురదృష్టము నవకాశముగా గొని, యన్న కొలుని తమ్ముడొకడు మిగిలిన రాజ్యము నాక్రమించెను. చేయునది లేక మిహిరకులుడు ప్రాణముల చేతబుచ్చుకొని కాశ్మీర దేశము జేరుకొనెను. కాశ్మీరరాజు మిహిరకులునికి శరణిచ్చి, గారవించి అతని రాజ్యములో చిన్న భాగమునకు మిహిరకులుని అధిపతిగ నియమించెను. మిహిరకులుడు కొన్ని సంవత్సరములు

ఆ ప్రాంతమును బరిపాలించుచు, చివరకు బలమైన సైన్య మును నిర్మించుకొని మంచి అవకాశము జూచుకొని, తనకు సాయము జేసిన కాశ్మీర రాజు నెదిరించెను. కుటిలోపాయమున అతని నోడించి కాశ్మీర సింహాసనము నాక్రమించెను.

ఆతరువాత కొలది కాలముననే పొరుగున గల గాంధార రాజ్యముపై దండెత్తి రాజకుటుంబములోని వారందరిని, వేలాది ప్రజలతో గలపి సింధునదీతీరమున చిత్రవధ చేయించెను. గాంధారము మిహిరకులునికి లొంగిపోయి, అతని సామ్రాజ్య భాగమైనది.

మిహిరకులుడు శివభక్తుడట! ఈ ప్రబుద్ధుడు బుద్ధునిపై పగబట్టి బౌద్ధులను అడవి మృగములవలె వేటాడి చంపెను. అనేక బౌద్ధారామములను, స్థూపములను నిర్మూలించెను. ఏనుగులను కొండలమీదనుండి క్రిందకు త్రోయించి, అవి గావుకేకలు పెట్టుచూ మరణించు దృశ్యములజూచి ఈతడు సంతోషించుచుండెడివాడట!

ఈ విధముగా మహాభయంకరమైన పరిపాలన సాగించి క్రీ॥శ॥ 540 ప్రాంతమున ఈనరరూప రాక్షసుడు మరణించెను.

మిహిరకులుని మరణముతో హూణసామ్రాజ్య మంతరించెను. టర్కీనుండి, పర్షియానుండి అనేక దండయాత్రలను హూణులు ఎదుర్కొనవలసి వచ్చినది. సమర్థుడైన నాయకుడు లేక, ఐకమత్యము నశించి, హూణసామ్రాజ్యము అంధకారమున గలసిపోయెను.

హూణుల దండయాత్రల వలన భారతదేశము అనేక కష్టనష్టముల నెదుర్కొనవలసి వచ్చెను. హూణులు నర రూప రాక్షసులు. దోపిడి వారి వృత్తి! నరహత్య వారి వినోదము!! పల్లెలనూ, పట్టణములనూ తగులబెట్టి ప్రజల చెరబట్టుట వారి విలాస క్రీడ!!! భారతదేశ చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖించదగిన మహోజ్వల గుప్త సామ్రాజ్య వైభవమును సర్వనాశనము జేసినది హూణులు. వీరి దండయాత్రలతో మన దేశము ముక్కలు ముక్కలుగా విభజింపబడి, ఛిన్నాభిన్నమైపోయెను. రాజకీయ ఐక్యత అంతరించి అరాజక మేర్పడి సంక్షోభము బయలుదేరెను.

హూణుల దండయాత్రల వలన భారతీయ నాగరికత కొంత పరివర్తన జెందెను. కాలక్రమమున ఈ హూణులలో కొందరు భారత దేశమున స్థిరనివాసము లేర్పరుచుకొని, భారత జాతితో నైక్యమైపోయిరి. వీరి ప్రభావము ప్రసరించుట వలననే రాజపుత్రులు విపరీతమైన ధైర్య సాహసములకు ప్రసిద్ధి చెందగల్గిరి.



# హర్షవర్ధనుడు

భారత దేశమును పరిపాలించిన కడపటి హైందవ చక్రవర్తులలో హర్షవర్ధనుడు ప్రసిద్ధుడు. బహుముఖ ప్రజ్ఞా పాండిత్యములు గల ఈ మహా పురుషుని ధర్మనిరతిలో మౌర్య సామ్రాట్టు అశోకునితోనూ, పరాక్రమములో కళాపోషణలో గుప్త సార్వభౌములు చంద్రగుప్త విక్రమాదిత్య, సముద్రగుప్తులతోనూ పోల్చవచ్చును.

హర్షవర్ధనుడు క్రీ॥ శ॥ 7 వ శతాబ్దములో ఆర్యావర్తమును పరిపాలించినవాడు. అంతకు ముందు అనగా ఆరవ శతాబ్దమున ఉజ్జయినిని పరిపాలించిన రాజుల గురించి గాని వారి రాజ్యముల గురించిగాని తెలుసుకొనుటకు మన చరిత్రలో కానవచ్చుటలేదు.

మన దేశ చరిత్రలో క్రీ॥ శ॥ ఆరవ శతాబ్దమునుండి పండ్రెండవ శతాబ్దము వరకూ గల కాలము పౌరాణికయుగమని పేరొందినది. హైందవ చరిత్రలో ఇదే కడపటి యుగము. ఈ యుగారంభమున సిరిసంపదలతో, సంగీత సాహిత్యములతో, సామ్రాజ్య వైభవములతో మహోజ్వల చరిత్ర సృష్టించిన భారతావని క్రమముగా పతన మార్గమున క్రీ॥ శ॥ 1192 లో జరిగిన రెండవ స్థానేశ్వర యుద్ధములో తురుష్కుల వశమైపోయినది. నాటినుండి క్రీ॥ శ॥

1947 ఆగస్టు 15 వ తేదీ వరకూ పర దేశీయుల పాలనలో, పీడనలో నలిగి చైతన్యహీనమై పాలిపోయినది.

ఈ విషాద పరివర్తనమునకు కారణము భారతీయ రాజులలో నశించిన ఐకమత్యము భారతీయుల హృదయములనుండి వైదొలగిన స్వాభిమానము అని చెప్పవచ్చును. ఈ ఆరు శతాబ్దముల కాలములో పురాణము లనేకములు రచింపబడుటచే దీనిని పౌరాణిక యుగమనుచుండిరి.

ఈ పౌరాణిక యుగమందు హర్షవర్ధనుని కాలము నకే భారత దేశము ఉచ్ఛస్థితి ననుభవించినది. హర్షుని జీవిత ఘట్టముల వస్తువుగా తీసుకొని బాణుడను మహాకవి హర్ష చరిత్రమను మహా గ్రంథమును రచించెను. నేడు హర్షుని గురించి తెలుసుకొనుటకు మనకు ఈ గ్రంథరాజమే ఆధార ముగా నున్నది. దీనికి తోడుగా క్రీ॥ శ॥ 630 నుండి 644 వరకూ భారత దేశములో పర్యటించిన చీనా యాత్రి కుడు యువాన్ చాంగ్ రచనలు కొన్ని మనకు లభ్యమగు చున్నవి. యువాన్ చాంగ్ భారత దేశములో అనేక భాగ ములను దర్శించి, నాటి రాజకీయ వ్యవస్థ స్వరూపము, సాంఘిక నైతిక పరిస్థితులు వివరముగా తన గ్రంథములో వర్ణించెను. యువాన్ చాంగ్ జీవిత చరిత్రను ఒక గ్రంథ ముగా రచించిన హ్వ్యాలీ యను చీనా రచయిత వలన మరి కొన్ని వివరములు మనకు లభ్యమగుచున్నవి. చైనా దేశ

చరిత్రలో హర్షవర్ధనుని గురించి అనేక గాథలు వ్రాయబడినవి.

అనేక శతాబ్దములుగా ఆర్యావర్త మందలి స్థానేశ్వరము పవిత్రభూమిగా గౌరవించబడుచున్నది. ఈ ప్రాంతముననే అనేక ధర్మయుద్ధములు జరిగినవి. ఇచ్చటనే అనేక మంది మహావీరులు జన్మించి, రణమొక క్రీడగా భావించి మహా సంగ్రామముల గావించినారు. ఆరవ శతాబ్ద ప్రారంభంలో ఈ స్థానేశ్వరము నేలుచున్న ప్రభాకరవర్ధనుడను రాజు గొప్ప సైన్యమును గూర్చుకొని జైత్రయాత్ర సాగించి, పంజాబులోని హూణులను క్రూరులను పారద్రోలి, మాళవను జయించి రాజపుటానాలోని ఘూర్జరుల ఓడించి సామ్రాజ్యమును విస్తరింపజేసెను.

క్రీ॥ శ॥ 604 వ సం॥లో గుప్త సామ్రాజ్య వినాశనమునకు కారణభూతులై దేశమున శాంతి భద్రతలకు ఉపద్రవముగా పరిణమించిన హూణులను జయించిరమ్మని ప్రభాకరవర్ధనుడు తన కుమారుడైన రాజ్యవర్ధనుని బంపెను. ఈ హూణులకే శ్వేత హూణులని మరియొక పేరు గలదు. వీరు కుమారగుప్తుని కాలమునుండి తరచుగా విజృంభించుచూ, దేశమునకు మిక్కిలి కష్టనష్టములు కలుగజేయుచుండిరి. ఆ తరువాత క్రీ॥ శ॥ 455 లో రాజ్యమునకు వచ్చిన స్కంధగుప్తుడు హూణుల నోడించి, దేశమునుండి పారద్రోలెను. కాని స్కంధగుప్తుని వృద్ధాప్యములో హూణులు తిరిగి

విజృంభించి చివరకు గుప్త సామ్రాజ్య వినాశనమునకు దారి తీసిరి. ఈ హూణులతో బాధలు పడలేకనే ప్రభాకరవర్ధనుడు రాజ్యవర్ధనుని వారిపైకి బంపెను. గొప్ప సైన్యముతో బోయి రాజ్యవర్ధనుడు వాయువ్య సరిహద్దు రాష్ట్రమున హూణుల నెదిరించెను. రాజ్యవర్ధనుని కంటె నాలుగు సంవత్సరములు చిన్నవాడైన హర్షవర్ధనుడు కొంతకాలమైన తరువాత కొంత అశ్వదళమును వెంటబెట్టుకొని అన్నకు సహాయము చేయుటకు బోయెను. కాని తన సహాయము లేకనే రాజ్యవర్ధనుడు హూణుల నెదిరించెను. హర్షవర్ధనుడు కొండల దిగువ భాగమున గల అరణ్య ప్రాంతములో వేటాడుతూ వినోదముగా కాలము గడుపుచుండెను.

ఆ సమయములో ప్రభాకరవర్ధనునికి అకస్మికముగా జ్వరము ముంచుకొని వచ్చినది. అతడు జీవించునను నమ్మకము నశించినది. ప్రభాకరవర్ధనునికి రెండవ కుమారుడైన హర్షునిపై ప్రత్యేకానురాగము గలదు. అతడు కడసారి చూచుటకు రమ్మని హర్షవర్ధనునికి కబురంపెను. పిడుగు లాంటి ఈ వార్త వినినంతనే, రెక్కలు కట్టుకొనివచ్చి హర్షవర్ధనుడు రాజధానిలో వ్రాలెను. ప్రభాకరవర్ధనుడు కొద్ది రోజులకే మరణించెను.

ప్రభాకరవర్ధనుని మరణానంతరము రాజ్యము న్యాయముగా పెద్దకుమారుడైన రాజ్యవర్ధనునికి చెందవలసియున్నది. కాని రాజు కొలువులోని ప్రముఖులు చాలమంది రాజ్యవర్ధ

నుని కంటె, హర్షవర్ధనుని సింహాసన మెక్కించవలయునని ప్రయత్నములు ప్రారంభించిరి. ఇందుకనుకూలముగా ఆ సమయమున రాజ్యవర్ధనుడు రాజధానిలో లేడు. కాని ఈ ప్రయత్నములు కార్యరూపము ధరించకముందే, తండ్రి మరణ వార్త వినిన రాజ్యవర్ధనుడు హుటాహుటిని రాజధానికి తిరిగి వచ్చెను. అతని రాకతో పరిస్థితులన్నియు మారిపోయెను. తన వ్యతిరేకులందరనూ అదుపులో పెట్టి రాజ్యవర్ధనుడు సింహాసన మధిరోహించెను. హర్షవర్ధనుడు గూడ సాదరముగా అన్నను సింహాసనమున కాహ్వానించెను.

రాజ్యవర్ధనుడు సింహాసన మధిష్టించిన కొద్ది కాలమునకే అతడు తిరిగి రాజధానిని వదలి యుద్ధమునకు పోవలసి వచ్చెను.

రాజ్యవర్ధనుని చెల్లెలు రాజ్యశ్రీ కనూజి పాలకుడైన గృహావర్మ కీయబడెను. మాళ్వ రాజ్యాధీశుడు గృహావర్మపై దండెత్తి, అతనిని జయించి చంపి భార్యయైన రాజ్యశ్రీని చెరబెట్టెను. ఈ వార్త విన్న రాజ్యవర్ధనుడు తక్షణము మాళ్వరాజును శిక్షించి, సోదరి రాజ్యశ్రీని రక్షించుట తన ప్రథమ కర్తవ్యమని భావించెను. పదివేల అశ్వదళముతో మాళ్వపైకి బయలుదేరెను. రాజధానిని రక్షించుటకై గజదళముతో తమ్ముడైన హర్షవర్ధనుని నియమించెను. ప్రచండ పరాభవాగ్నితో విజృంభించిన రాజ్యవర్ధనుని ధాటికోర్వలేక అనతి కాలములోనే మాళ్వరాజు లొంగిపోయెను. కాని

మాళ్వరాజు స్నేహితుడైన వంగదేశాధీశుడు అగు శశాం
కుడు రాజ్యవర్ధనుని విందుకు పిలిచి, మోసగించి చంపెను.
ఈ పరిస్థితులలో రాజ్యశ్రీ చెరనుండి విడిపించుకొని వింధ్యా
రణ్యములలోనికి పారిపోయినది. కాని ఆమె ఎచ్చట తల
దాచుకొన్నదో హర్షవర్ధనునకి తెలియకపోయెను.

రాజ్యవర్ధనుని తరువాత సింహాసనమునకు రావలసిన
అతని కుమారుడింకను పసివాడగుటచే, తమ్ముడైన హర్ష
వర్ధనుడే సింహాసనమున కర్హుడని నిర్ణయింపబడెను. కాని
ఈ నిర్ణయము జరుగుటకు ముందు రాజధానీ నగరము
వర్ణింపనలవి కాని రాజకీయ సంక్షోభ మేర్పడెను. రాజ్యవర్ధ
నునిపై భక్తిగలవారు హర్షుడు రాజ్యమునకు వచ్చుట ధర్మ
విరుద్ధమని ఎదురు తిరిగిరి. చివరకు కొలువు కూటములోని
ప్రముఖులలో ఒకడైన 'భాండి' యను నాతడు ముందుకు
వచ్చి దేశక్షేమమునకై హర్షవర్ధనుడు సింహాసనమునకు
వచ్చుట అత్యావశ్యకమని ప్రకటించెను. హర్షుడు ఈ సంద
ర్భములో రాజ్యమాక్రమించుటకు విముఖుడుగా నుండెను.
కాని చివరకంగీకరించక తప్పలేదు. అతడు రాజ్యాధికా
రము స్వీకరించినను రాజునని ప్రకటించుకొనలేదు. ఆ తరు
వాత ఆరు సంవత్సరములకు అనగా క్రీ॥ శ॥ 612 లో
హర్షుడు లాంఛనపూర్వకముగా, బహువైభవముగా పట్టా
భిషేకము జేసికొనెను.

హర్షవర్ధనుడు రాజ్యమునకు వచ్చినంతనే అతనికి కనిపించిన కర్తవ్యములు రెండు. మొదటిది : తన సోదరుని హతమార్చిన వంగప్రభువు శశాంకుని శిక్షించుట. రెండు : వింధ్యారణ్యముల నెచ్చటనో తారాడుచున్న సోదరి రాజ్యశ్రీని రక్షించుట రాజ్యశ్రీ ఎండ కన్నెరుగక అంతఃపురములలో అల్లారు ముద్దుగా పెంచి పెద్దచేయబడిన సుకుమారి. ఆమెకు ప్రాప్తించిన దైన్యావస్థ పరికించిన హర్షవర్ధనుని హృదయము కరగిపోయినది. ఎంతటి శ్రమమైననూ, రాజ్యశ్రీని రక్షించి తీరవలయునని నిశ్చయించుకొనెను. రాజ్యశ్రీ అడవులలో తారాడి, విసిగి వేసారి నిరాశతో ఆత్మహత్యకు సిద్ధముగానున్న సమయమున హర్షుడామెను రక్షించుకొన గలిగెను. శశాంకునికి - హర్షునికి జరిగిన యుద్ధములో శశాంకుడు పరాజితుడై పారిపోయి ప్రాణములు దక్కించుకొనెను. ఆ తరువాత కొంత కాలమునకు శశాంకుడు హర్షుని పాదములపై బడి శరణువేడెను. హర్షుడా తని క్షమించెను. నాటినుండి వంగ ప్రభువు హర్షునకు సామంతుడయ్యెను.

శశాంకుని శిక్షించి రాజ్యశ్రీని రక్షించిన తదుపరి, హిందూదేశము నంతనూ ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందకు కొనివచ్చుటకు హర్షవర్ధనుడు విజయయాత్ర తలపెట్టెను. అయిదువేల గజదళమును, ఇరవై వేల అశ్వదళమును, యాభై వేల కాల్బలము హర్షసైన్యమందుండెను. ఈ

బ్రహ్మాండమైన సైన్యముతో హర్షుడు ఉత్తర భారతమున జైత్రయాత్ర సాగించెను.

ఈ జైత్రయాత్రను చైనా యాత్రికుడు యువాన్ చాంగ్ మనోజ్ఞముగా వర్ణించెను.

'హర్షవర్ధనుడు తూర్పునుండి పశ్చిమదిశ వరకూ తన ఆధిపత్యము నంగీకరించని రాజుల నందరనూ నిర్దాక్షిణ్యముగా అణచివైచుచూ, జైత్రయాత్ర సాగించెను. అయిదున్నర సంవత్సరముల కాలములో వాయవ్య భారతమంతయూ హర్షునికి లొంగిపోయెను. బంగాళమున అధిక ప్రాంతము అతని సామ్రాజ్యమున భాగమయ్యెను. అతని సైన్యము వృద్ధిజెంది అరవై వేల గజ దళముతో, లక్ష అశ్వదళముతో బ్రహ్మాండముగా రూపొందెను. హిమాలయ పర్వతములకు నర్మదా నదికి మధ్య గల భాగమంతయూ హర్షుని ఆధిపత్యము నంగీకరించెను నేపాళము - మాళవ - ఘూర్జర - సౌరాష్ట్ర రాజ్యములు - బంగాళము - కామరూపము - హర్షుని ఆజ్ఞలకు లోబడియుండెను. క్రీ॥ శ॥ 633 ప్రాంతములో వల్లభి రాజైన ధృవసేనుని జయించి, తన కుమార్తె నిచ్చి వివాహము జేసెను. కచ్, సౌరఘ, ఆనందపురము మొదలగు ప్రాంతములన్నియు క్రీ॥ శ॥ 641 నాటికి హర్షునికి లోబడిపోయెను. క్రీ॥ శ॥ 643 లో బంగాళతీరమున గల గంజాముపై హర్షుడు చేసిన దండయాత్ర అతని జీవితములో చిట్టచివరి యాత్రయని చెప్పవచ్చును. ఇన్ని ఘన

విజయములు సాధించి, ఆర్యావర్తమును ఏకచ్ఛత్రాధి పత్యము క్రిందకు తేగలిగిన హర్షవర్ధనుడు నర్మదా నదిని దాటి దక్షిణమునకు మాత్రము రాలేకపోయెను.

ఉత్తర హిందూస్థానములో తనకు లభించిన విజయములతో హర్షుడు సంతృప్తి జెందలేదు అతని సామ్రాజ్య కాంక్ష యింకనూ ప్రజ్వలించినది దక్షిణా పథమునుగూడ జయించవలెనను సంకల్పముతో ప్రచండ సైన్యమును గూర్చుకొని నర్మదా నదిని దాటెను

అప్పుడు దక్షిణ భారతమున గల రాజులలో వీరాధి వీరుడైన చాళుక్యరాజగు రెండవ పులకేసి ప్రసిద్ధి చెంది యుండెను. ఈతడు క్రీ॥ శ॥ 608 లో వాతాపి సింహాసనమును అధిష్ఠించెను. ఆ తరువాత రెండు దశాబ్దములపాటు ఈ యోధుడు అనేక సంగ్రామముల గావించి, ఇరుగుపొరుగు రాజ్యముల నన్నింటిని జయించెను. కృష్ణా గోదావరీ నదుల మధ్యగల వేంగి రాజ్యమును జయించి, అక్కడ క్రీ॥ శ॥ 609 లో తన సోదరుడైన కుబ్జవిష్ణువర్ధనుని రాజ ప్రతినిధిగా నియమించెను. ఈ మహావీరుడు హర్షుని ఎదిరించి క్రీ॥ శ॥ 620 లో ఆతని ఓడించి వెనుకకు తరిమివైచెను. తనను మించిన వీరుడు భారత దేశమును పాలించుచుండుట సహించలేక మహాయోధులని ప్రసిద్ధిగనిన సేనాధిపతులతో తన మహాసైన్యముల నడిపించుకొనిపోయి, చాళుక్యసామ్రాట్టు రెండవ పులకేశిపై దండెత్తి విఫలుడయ్యెను. చివరకు నర్మ

దానదివి ఉభయరాజ్యములకు సరిహద్దుగా, హర్షుడు అంగీక రింపవలసివచ్చెను.

ఏమైననూ 36 సంవత్సరములపాటు, తాను నిర్మించిన మహాసామ్రాజ్యమును వైభవోపేతముగా పరిపాలించిన హర్షవర్ధనుడు మహావీరుడనియేగాక గొప్ప పరిపాలనా దక్షు డని గూడ నిరూపించుకొనెను.

మౌర్యుల కాలమునుండి - గుప్తుల కాలమువరకూ, భారత రాజకీయరంగమునకు కేంద్రనగరముగానున్న పాట లీపుత్ర ప్రాభవము, హర్షుని కాలమున కొంతతగ్గినది. హర్షుడు కనూజ్‌ను జయించి, దానినే తన రాజధానిగా జేసికొనెను. కనూజ్ యిప్పటికి వెలుగునకు వచ్చిననూ, అది అతి ప్రాచీననగరములలో ఒకటి. మహాభారతమునందునూ, పతంజలి రచనల యందునూ, ఈ కనూజ్‌ను గురించిన వర్ణ నలు గలవు.

గుప్తులకాలములో కనూజ్ బౌద్ధమత కేంద్రములలో నొకటిగానుండెను. రెండవ చంద్రగుప్తుని కాలములో భారత దేశము దర్శించిన పాహియాన్ యను చీనాయాత్రికుడు దర్శించెను. ఆ పట్టణమున బౌద్ధవిహారములు, స్థూపములు నిర్మించబడియున్నవని అతడు వర్ణించెను. హర్షవర్ధనుని కాల మున కనూజ్ నగరమున గల బౌద్ధ విహారముల సంఖ్య నూరు వరకు పెరిగెను. అందు పదివేలమంది బౌద్ధ భిక్షువులు నివసించు చుండిరట! హర్షుడు బౌద్ధమతమునే గాక

హైందవమతమును గూడ ఆదరించెనని నిరూపించుటకు నాడు కనూజ్‌లో వెలసియున్న 200 దేవాలయములను నిదర్శనముగా పేర్కొనవచ్చును. గంగానదీతీరమున అయిదుమైళ్ల పొడవుగల్గిన ఈ నగరము మిక్కిలి సౌందర్యవంతముగా నిర్మింపబడినది. నగరమును రక్షించుటకు చుట్టును ఎత్తుగల కోటగోడ నిర్మించబడియుండెను. లోన చక్కని పూలతోటలు, కృత్రిమ సరస్సులు, మ్యూజియమ్‌లు గలవు. క్రీ॥ శ॥ 1017 లో గజనీమహమ్మద్ కనూజ్ వచ్చినప్పుడు ఆ నగర సౌందర్య సౌభాగ్యములజూచి దిగ్భ్రాంతుడయ్యెనట! కనూజ్ లోని భవనములన్నియు చంద్రకాంతశిలలతో నిర్మించబడియుండెను. అట్టి సుందర నగరమును రాజధానిగా జేసుకొని, హర్షవర్ధనుడు ఆర్యావర్తమును పరిపాలించెను.

ప్రజాక్షేమమునకై అహోరాత్రములు కష్టించి, ప్రభుత్వ వ్యవహారములన్నియు హర్షుడు స్వయముగా చూచుకొనుచుండెను. కొందరు చక్రవర్తులు తాము రాజ్యభోగములమాత్ర మనుభవించుచూ, పరిపాలనా భారమంతయు మంత్రులపై త్రోసివైచెదరు. హర్షుడు కేవలము రాజధానిలోనే కూర్చునియుండక, సపరివారముగా దేశములోని అన్ని భాగములనూ పర్యటించుచూ, ప్రజల స్థితిగతుల తెలిసికొనుచూ, ధర్మపరిపాలన గావించుచుండెను. ఆపర్యటన సందర్భము చక్రవర్తికి ముందుగా కొందరుద్యోగులుపోయి, చక్రవర్తి మజిలీచేయు ప్రదేశములలో గుడారములు, శిబిర

ములు నిర్మించుచుండిరి. చక్రవర్తి ఆ ప్రాంతములకు తరలి వచ్చి, ప్రజలెట్లు జీవించుచుండిరో, దేశమున శాంతిభద్రత లెట్లుండెనో ప్రత్యక్షముగాచూసి తెలిసికొని అచ్చటగల దుష్టుల శిక్షించి, సజ్జనుల సన్మానించి మరియొక ప్రదేశము నకు తరలిపోవుచుండెను. ఈ విధముగా చక్రవర్తి ప్రజా స్వామ్యములోవలె ప్రజలతో కలసిమెలసి వారితో సన్నిహిత సంబంధములు గలగియుండెడివాడు. ఒక మజిలీనుండి మరి యొక మజిలీకి బోవునప్పుడు – పాత మజిలీయందు చక్రవర్తికై నిర్మించబడిన గుడారములు కాల్చివేయబడుచుండెను. చక్రవర్తి బయలుదేరుటకు ముందు ఆ ప్రాంతమందలి బీదసాద లకు ధారాళముగా విరాళము లిచ్చెడివాడు.

చైనా యాత్రికుడైన యువాన్‌చాంగ్ హర్షవర్ధనుని మొదట సందర్శించినది ఈ పర్యటన సందర్భమున నే! అప్పుడు హర్షుడు ఒరిస్సాలో పర్యటన ముగించుకొని వంగ దేశమునకు వచ్చియుండెను.

హర్షుని పరిపాలన ఆదర్శప్రాయమైనది. అతడు సర్వాధికారములుగల నిరంకుశ చక్రవర్తియైనను, అతని యధికారము పూర్తిగ ప్రజాక్షేమమునకై వినియోగింప బడెను. సమర్థుడును, సన్మార్గవర్తనుడును అయిన నియంత దేశమును నిస్సంశయముగా ఉద్ధరించగల్గును. కాని సర్వాధి కారములు చేతికి వచ్చినంతనే మానవునిలో అహంభావము పెరుగును తాను భగవంతుని అపరావతారమను స్వాతిశ

యము కల్గును. తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళనియని వాదించును. మంచి తనకు తోచదు, ఒకరు చెప్పినది వినడు. అసలు ఆ నిరంకుశునికి ఎదురాడుటకు ఎవరికి ధైర్యముండును? ఎదురాడి ఎవరు జీవించగలరు? కాని హర్షుని నిరంకుశ మట్టిది కాదు. సామ్రాజ్య పరిపాలనలో తగిన సలహాల నిచ్చుటకు హర్షుడొక మంత్రిపరిషత్తు నియమించెను. గుప్తుల కాలమునాటి సామ్రాజ్య విభజన హర్షవర్ధనుని కాలమున గూడ అమలులో నుండెను.

హుయాన్‌సాంగ్ హర్షుని పరిపాలనా దక్షతను మిక్కిలి కొనియాడెను. మానవ కళ్యాణమును మహోన్నతాదర్శముల మీద ఆధారపడిన పరిపాలనా విధానమని యాతని అభిప్రాయము. హుయాన్‌సాంగ్ క్రీ॥ శ॥ 629 నుండి 645 వరకు దక్షిణ భారత దేశపు చివరి భాగము మినహాయించి, తక్కిన ప్రాంతములన్నియు పర్యటించెను. అతడు తన యాత్రానుభవములను 'పశ్చిమ ప్రపంచ యాత్ర' అను పేరుతో గ్రంథముగా రచించెను. ఆ గ్రంథము ఫ్రెంచి, జర్మన్, ఇంగ్లీషు భాషలలోనికి అనువదించబడి ప్రపంచమందంతటా గౌరవించబడుచున్నది. భారత దేశ చరిత్ర తెలుసుకొనుటకు మనకది ఒక అమూల్యమైన విజ్ఞాన భాండారముగా పరిగణించబడుచున్నది. అతని రచనల వలననే హర్షవర్ధనుని పరిపాలనా విధానము మనకు తెలియుచున్నది.

హర్షుని సామ్రాజ్యమున పన్నుల భారము మిక్కిలి తేలికగా నుండెను. రాజునకు వచ్చు ఆదాయములో భూమి పన్ను ముఖ్యమైనది. పండిన పంటలో ఆరవవంతు పన్నుగా చెల్లింపవలసియుండెను. ఈ భూమి పన్నులో నాల్గవవంతు ఉన్నతోద్యోగుల జీతములకు, మరొక నాలుగవవంతు పరిభుక్త మత వ్యవహారములకు ఖర్చు పెట్టబడుచుండెను. పరిజాక్షేమమునకై చేయబడు నిర్మాణములలో కూలీలచే నిర్బంధముగా పనులు చేయించెడివారు. కాని దానికి తగిన ప్రతి ఫలము ప్రభుత్వము చెల్లించుచుండెను. ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనము గాని, పక్షపాత బుద్ధిగాని లేక, పరిపాలన ధర్మబద్ధముగా నడుపబడుచుండెను. ప్రజలు కూడ ధర్మపరులై, ప్రభుభక్తి పరాయణులై యుండిరి. నేరస్థులపై విధించబడు శిక్షలు మిక్కిలి కఠినముగా నుండెను. అవినీతి, మోసము, కృతఘ్నత మొదలగు నేరములకు అంగ విచ్ఛేదము, ద్వీపాంతరవాసము మొదలైన దారుణ శిక్షలు విధింపబడుచుండెను. నిందితుడు దోషియగునా, కాదా యని నిరూపించుటకు అగ్ని, జల శోధనలు చేయబడు చుండెను.

న్యాయ పరిపాలన హర్షవర్ధనుని కాలములో ఇంత కఠినముగా నుండుటకు కారణమేమి? గుప్తుల కాలమున న్యాయ పరిపాలన చాల సరళముగా నుండెను. కాని గుప్త సామ్రాజ్య పతనానంతరము దేశమున శాంతి భద్రతలు

వసించెను. హూణుల దండయాత్రలతో దొంగతనములు - దోపిడీలు పెరిగిపోయెను. రాజ మార్గములు దోచుకొనిరట! ఇట్టి అరాజక పరిస్థితుల అదుపులో పెట్టుటకు హర్షుడు కఠినముగా ప్రవర్తించ వలసివచ్చినది. తత్ఫలితముగా హర్షుడు రాజ్యమునకు వచ్చిన అనతి కాలములోనే, దేశమున శాంతి భద్రతలు వ్యాపించెను. అరాచకము నశించెను.

హర్షుని సామ్రాజ్య మందలి ప్రజలు న్యాయవర్తనులనియు, ధర్మ పురుషులనియు, పాపభీతి కలిగిన వారనుటచే దుర్మార్గములకు భయపడెడి వారనియు, మోసము - అసత్యము వారికి తెలియదనియు - యువాన్ చాంగ్ వర్ణించెను.

హర్షుడు తన ఆదాయములో కొంతభాగము యజ్ఞ యాగాది క్రతువులకు, సజ్జన సన్మానమునకు వినియోగించుచుండెను. వర్తక వాణిజ్యములు పెంపొందుటకు గూడ హర్షుడు కృషి జేసెను. వర్తకులపై బహుస్వల్పమైనపన్నులు విధించి, వారికనేక సౌకర్యములు కలుగజేసెను. నాడు విదేశములతో హిందూదేశము సముద్రాంతర వ్యాపారము విరివిగా చేయుచుండెను. హర్షుని సామ్రాజ్యమున అసంఖ్యాకముగా కోటీశ్వరులుండెడివారు.

దేశమందలి స్థితిగతులను ఎప్పటికప్పుడు వ్రాసి పంపుటకు పలుప్రాంతములలో కొందరు విలేఖరులు నియమించబడిరి.

చోళుల రాజ్యాంగమందువలె, హర్షుని రాజ్యమున గూడ గ్రామ పరిపాలనకు అధిక ప్రాముఖ్య మీయబడెను. నేటి మునసబు కరణములను బోలిన అక్షపటలికుడు - కరణికుడు - అను ఇద్దరు గ్రామోద్యోగు లుండెడివారు. కొన్ని గ్రామములు కలసి ఒక తాలూకాగానూ, కొన్ని తాలూకాలు గలసి ఒక మండలముగానూ, నిర్మించబడుచుండెను.

హర్షవర్ధనుడు విద్యాప్రియుడు. బ్రాహ్మణులలోనూ, బౌద్ధ బిక్షువులలోనూ, విశ్వవిఖ్యాతులైన పండితులు హర్షుని కాలమున భారతదేశమున విలసిల్లిరి. అనేక బౌద్ధరామములు విశ్వవిజ్ఞానక్షేత్రములుగా భాసించినవి. బుద్ధగయలో గల 'మహాభోధి' యను ఆరామములో వేయిమంది బౌద్ధ భిక్షువులు గలరు. విశ్వవిఖ్యాతమైన నలంద విద్యాలయము హర్షుని కాలములో మహోన్నత దశను అనుభవించినది. ఈ విద్యాలయమునందు అన్నిమతములకు చెందిన విద్యార్థులు పదివేలమంది ఉండెడివారు. పదిహేనువందలమంది ఉపాధ్యాయులు గలరు. విభిన్నమతములకు చెందిన విద్యార్థులందరూ తరచుగా సమావేశమై సిద్ధాంతచర్చలు సాగించుచుండిరి. ఈ చర్చలవలన అనేక మహావిషయార్థములు విద్యార్థుల కవగతమగుచుండెను. ఈ చర్చలకు కాలము చాలకుండెను. ధర్మపాలుడను మహాపండితుడు నలందా విశ్వవిద్యాలయమునకు ప్రధానాచార్యులుగా నుండెను. మహావక్తయని ప్రసిద్ధిగాంచిన ప్రభమిత్రుడు, ఛలోక్తులతో

విజ్ఞానసాగరమును మథించగల జీవమిత్రుడు - ఆదర్శజీవిత
మును గడుపు ధర్మపరుడగు జనచంద్రుడు, మహాజ్ఞాని శీలా
భద్రుడు నలందా విశ్వవిద్యాలయము నలంకరించిన మహా
పురుషులు. ఆధ్యాత్మిక శాస్త్రము, వైద్య, జ్యోతిష శాస్త్ర
ములు - నలందలో ప్రముఖముగా విరాజిల్లినవి. దేశము
లోని బౌద్ధారామములన్నియూ విజ్ఞాన కేంద్రములుగా భాసిం
చుచుండెను. ఈ ఆరామము లన్నింటిని యువాన్ చాంగ్
సందర్శించెను. ప్రతి ఆరామములోనూ హీనయాన, మహా
యాన పక్షములకు చెందిన బౌద్ధభిక్షువులుండెడివారు. బ్రాహ్మ
ణులు గూడ మహాపండితులని ప్రసిద్ధిగన్నవారు. విష్ణువు -
శివుడు - సూర్యుడు నాటి బ్రాహ్మణ గణమునకు ఆరాధ్య
దేవతలు. పురుషులేగాక స్త్రీలుగూడ విజ్ఞానార్జనలో ఆరి
తేరియుండిరి. హర్షుని సోదరి రాజ్యశ్రీ, బౌద్ధపండితుడైన
దివాకరమిత్రుని సమక్షమున విజ్ఞానసముపార్జన గావించి
నది. కాని ఆ రోజులలో స్త్రీలకు బాల్యముననే వివాహ
ములు జరుగుచుండెను. సతీసహగమనము ముఖ్య ఆచార
ముగా నుండెను.

హర్షుడు విద్యాప్రియుడేగాక, సాహిత్యపోషకుడు
గూడ నైయుండెను. తానుగూడ కవియై, రత్నావళి, ప్రియ
దర్శిక, నాగానందము అను మూడు నాటకములు రచించెను.
ఒక వ్యాకరణ గ్రంథము, 500 సంస్కృత శ్లోకములతో
గూడిన బుద్ధుని జాతక కథలను రచించెను. ఈ సంపుటికి

జాతకమాలయని పేరు. బౌద్ధగాథను ఇతివృత్తముగాగొని, హర్ష వర్ధనుడు రచించిన '.నాగానందము' ఉత్తమ నాటకములలో ఒకటిగా విమర్శకులచే కొనియాడ బడినది. రత్నావళి-ప్రియదర్శిక నాటకములు నాగానందమంత ప్రసిద్ధములు గాకపోయిననూ, వాటికిగూడ మన సాహిత్యమున సముచిత స్థానము గలదు. ఈ గ్రంథములబట్టి హర్షునకు సంస్కృతమునందు మంచి ప్రజ్ఞాపాండిత్యములు గలవని తెలియుచున్నది.

( ఈ నాటకములను హర్ష వర్ధనుడు రచించలేదని కొందరనుచుందురు. బీదయైన దావకుడను పండితుడు, వీటిని రచించి, దరిద్రబాధకు తాళలేక, హర్షునకిచ్చి కొంత విత్తమును ప్రతిఫలముగా పొందెనట! ఆ నాటకములను తన సామంతులందరూ, రాజధానిని సందర్శించిన సందర్భమున హర్షుడు తానే రచించినట్లు చెప్పుకొని ప్రదర్శింపజేసెనట!! ఈ విచిత్ర గాథలలో నెంత సత్యమున్నదో మనమూహించలేము. కాని చరిత్రలో ఏ చక్రవర్తి రచనలు సాగించిననూ, ఇట్టి అపవాదములు తరచుగా వచ్చుచునేయుండును.)

హర్షుడు అనేకమంది కవిపండితులను పోషించెను. తన రాబడిలో నాల్గవవంతు సాహిత్యమూర్తుల సన్మానించుటకై యాతడు వెచ్చించుచుండెను. అతని యాస్థానమాశ్రయించిన కవిపండితులలో మహాప్రసిద్ధుడు బాణుడు. కాదంబరి, హర్ష చరిత్రమను వచన ప్రబంధముల నీతడు సంస్కృత

భాషలో వ్రాసెను. సంస్కృతభాషలో అత్యంత రసవత్తరమైన వర్ణనలు కలిగి, అనన్య సామాన్య గౌరవము నందుకొనిన 'కాదంబరి' ఒక కల్పిత గాథ. ఈతడు వ్రాసిన హర్షచరిత్ర, చక్రవర్తి జీవిత ఘట్టముల వర్ణించునది. కవి సహజములైన అతిశయోక్తు లటనట గన్పించినను, ఇందలి విషయము లనేకములు యదార్థములని నమ్మదగినవని పలువురి యభిప్రాయము.

హర్షవర్ధనుడు మొదట హిందువుగనుండెను. రత్నావళి - ప్రియదర్శిక -యను హర్షుని నాటకములయందు శివుని గురించి ప్రార్థనలబట్టి, ప్రథమమున ఈతడు వైదిక మతము నాదరించెనని తెలియుచున్నది. కాలక్రమమున హర్షుని మనము బౌద్ధమతముపై లగ్నముకాజొచ్చెను. నిస్సంశయముగా నీతడు అశోకమౌర్యుని తన జీవితమునకు ఆదర్శముగా నెంచుకొనియుండెను. ప్రథమమున ఈతడు హీనయానమును ఆదరించెను. క్రమముగా హీనయానముకంటె మహాయానమే యాతనిని మిగుల యాకర్షింపజొచ్చెను. అహింస పరమధర్మమను సిద్ధాంతమును తన జీవితములో తు. చ. తప్పకుండ యాచరించెను. వేటనుమాని, జంతుబలులు ఖండించెను. ధర్మప్రచారము గావించవలెనను యావేదనతో అతనికి నిద్రాహారములు రుచించెడివి కావట! మాంసాహారము నేరముగా ఆ దయామయుడు పరిగణించెనట!

అశోకుని ఆదర్శముగా నిల్పుకొని హర్షవర్ధనుడు మౌర్య సామ్రాట్టువలె, అనేక ప్రజోపయోగకరములైన

కార్యములు గావించెను. బాటసారుల సౌకర్యార్థమై అనేక విశ్రాంతి గృహములను, సత్రములను ఆతడు నిర్మించెను. ఆ సత్రములలో నిరతాన్నదానము ప్రభుత్వ విత్తముతో జరుగు చుండెను. వైద్యశిఖామణులు ఉచితముగా వైద్యము చేయుటకు రాజవేతనములపై నియోగించబడిరి.

బౌద్ధభిక్షువైన దివాకరమిత్రుడు హర్షవర్ధనునికి బౌద్ధ మతాసక్తి కలుగచేసినను చీనాయాత్రికుడు యువాన్ చాంగ్ బోధనలతోనే ఆతడు బౌద్ధమతమును స్వీకరించెను. హర్షవర్ధనుని కంటె ముందె బౌద్ధమత ప్రభావమునకు లోంగిన యాతని సోదరి రాజ్యశ్రీ మహాపండితురాలు. ఆ భిక్కుని దీక్షబూని, అన్ననుగూడ బౌద్ధమతము స్వీకరించుటకు ప్రోత్సహించెను. హర్షవర్ధనుని పరిపాలనలో రాజ్యశ్రీ యొక్క పాత్ర అనల్పమైనది. హర్షుని జీవితములో ఆమె ప్రభావము అసామాన్యమైనది.

హర్షుని పూర్వీకులందరూ సూర్యభగవానుని ఆరాధించిరి. హర్షుడు బౌద్ధమతమును స్వీకరించినప్పటికీ, తమ కులదైవమైన సూర్యభగవానుని జీవితాంతమువరకు పూజించుచునే యుండెను. హైందవ బౌద్ధమతములు రెండును ఇరుగు పొరుగున సఖ్యముతో జీవించుచున్న అన్నదమ్ముల వలె వర్ధిల్లినవి ఒకే కుటుంబములో కొందరు బౌద్ధులును, కొందరు హైందవులుగనూ మెలగుచుండిరి. హర్షుడు శివుని, సూర్యుని, బుద్ధుని తన దైవములుగా భావించి, పూజించి

వారి కనేక దేవాలయములు నిర్మించెను. చిత్రమేమనగా నాడు రాజమతమైన బౌద్ధమతముకంటె వైదికమతమే ఉచ్ఛదశయందున్నది. ఇది హర్షుని పరమత సహనమునకు బలమైన తార్కాణము.

బౌద్ధ మతప్రచారమునకై గంగానదీతీరమున అనేక వేల స్థూపములను హర్షుడు నిర్మించెను. అనేక విహారముల కట్టించెను. ఆ స్థూపములలో ఒక్కొక్కటి కనీసము నూరడుగుల ఎత్తు గలిగియున్నవి. అవన్నియు కలపతో నిర్మింపబడి యుండుటచే కాలగతిని శిథిలమై నేటికి నామరూపములు లేకుండబోయినవి.

ఏడవ శతాబ్దమునాటి భారతదేశమందలి మతపరిస్థితులు చిత్రముగానుండును. రాజకుటుంబమున కూడ, ఎవరికి తోచిన మతములను వారు ఆరాధించుచుండిరి. హర్షుని పూర్వీకుడైన పుష్యభూతి యను రాజు శివునిదప్ప వేరొక దైవమును ప్రార్థించి యెరుగడు. ఈతడు వీరశైవుడు. వీరశైవులు ప్రచండస్వభావముగలవారు. స్వ - పరమతములపై బలమైన రాగ ద్వేషములు గలవారు వీరు. ఇక హర్షుని తండ్రి ప్రభాకరవర్ధమానుడు సూర్యోపాసకుడు. హర్షుని అన్న రాజ్యవర్ధనుడు బౌద్ధమతాభిమాని. హర్షుడు రాజ్యమునకు వచ్చిన తరువాత 25 సంవత్సరములవరకూ హిందువుడు ఆ తదుపరి బౌద్ధుడు.

మతమనగా అభిప్రాయము. అనగా సృష్టికిని - సృష్టికర్తకునుగల సంబంధముల గురించిన అభిప్రాయ మన

వచ్చును. ఇట్టి అలౌకికమైన మతమును గురించి విద్వేషముల పెంచుకొని, లౌకిక జీవితమును కల్లోలపరచుకొనుట అనావశ్యకమని హర్షుని యభిప్రాయమైయుండెను.

హర్షుని కాలమున జైనమతమునకు ఆర్యావర్తమందు తగినంత పలుకుబడిగాని, ప్రాభవముగాని లేకుండెను. యదార్థ మాలోచించినచో జైనమతమెన్నడు ఆర్యావర్తమందు ఉధృతముగా ఉండియుండలేదు. హర్షుని కాలమున వైశాలి, వంగ దేశములందు మాత్రము జైనమతము కొంత పలుకుబడి కలిగియుండెను. సామాన్య ప్రజానీకములో అధికసంఖ్యాకులు పురాణదైవముల పూజించుచుండిరి. పురాణములు మొత్తము పదునెనిమిది గలవు ఈ గ్రంథములన్నియు అనేక కాలములలో, అనేక రచయితలచే వ్రాయబడినవి. వేదములలోని కొన్ని వర్ణనముల నాధారముగా గొని, వానిని పదింతలుగా చేసి పురాణములు వ్రాయబడెను. ఈ పురాణగాథలు జానపదులను ఎక్కువగా ఆకర్షించినవి ఇంద్ర వరుణ రుద్రాది వైదిక దైవములకంటె-బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, గణపతి మొదలయిన పౌరాణిక దైవములు ఎక్కువగా గౌరవించబడసాగిరి. ఈ పురాణకర్తలలో కొందరు శైవులు, కొందరు వైష్ణవులు గలరు. ఈ విధముగా పౌరాణిక యుగమని ఈ కాలము పేరుగాంచినది.

హర్షుడెంత మత సహిష్ణుడైననూ, మతము పేరిట ఈతని కాలములో సైతము అనేక దారుణ సంఘటనలు జరిగి రక్తపాతమునకు దారితీసినవి.

మధ్యబంగాళమును పరిపాలించుచున్న శశాంకుడు శివభక్తుడు. ఈ కుటిలాత్ముడే హర్షవర్ధనుని సోదరుడైన రాజ్యవర్ధనుని మోసగించి హత్యజేసెను. ఇతనికి శివునిపై ఎంత భక్తిగలదో బుద్ధునిపై అంత ద్వేషము శైవమతము నెంత ఆదరించెనో బౌద్ధమతమునంత నిర్మూలించెను. బుద్ధగయలోని బోధివృక్షముపై గూడ యాతనికి కక్షపుట్టి, దానిని ఊడబెరికి తగులబెట్టించెనట! అచ్చటగల ఆరామముల నేలమట్టముజేసి, బౌద్ధబిక్షువుల దునుమాడెనట!! బౌద్ధమత నిర్మూలనముకై యాతడు నేపాలు కొండలవరకూ సైన్యసమేతుడై జైత్రయాత్రలు సాగించియుండెను. అతరువాత కొన్ని సంవత్సరములకు మగధ నేలిన పూర్ణవర్మయను రాజు బోధివృక్షమును తిరిగి నాటించెను. ఈతడు మౌర్య వంశమునకు చెందినవాడు.

హర్షుని కాలమున బౌద్ధమత శాఖలైన హీనయాన మహాయాన బేధములు స్పష్టరూపము ధరించెను. బ్రాహ్మణగణమంతయూ చక్రవర్తి బౌద్ధమతముపై చూపుచున్న గౌరవమును, తమ కవమానముగా భావించి హర్షునిపై ద్వేషము వహించియుండిరి. అన్ని మతములకు చెందిన పండితులనూ రావించి, వారిచే విభిన్న సిద్ధాంతముల గురించిన చర్చలు జరిపించి, ఆలకించుట హర్షునికి మిక్కిలి యిష్టమైన విషయము. ఈ వాద ప్రతివాదముల వినుటకు హర్షుని సోదరి రాజ్యశ్రీ గూడ వచ్చుచుండెడిది.

ఈ వాద ప్రతివాదములలో బ్రాహ్మణగణము యువాన్ చాంగ్‌పై కత్తిగట్టినది. వ్యర్థవివాదములు తీవ్ర రూపము ధరించి విద్వేష విషబీజముల విరజిమ్ముచుండెను. ఇది హర్షునకు ఇష్టములేకుండెను. దానికి తోడుగా కొందరు శత్రువులు యువాన్ చాంగ్ ప్రాణములు తీయుటకు ప్రయత్నములు చేయుచుండిరి. ఈ ప్రమాదము నివారించుటకు హర్షుడు ఒక ఆదేశము జారీచేయించెను.

చైనా యాత్రికుడైన యువాన్ చాంగ్‌కు ఏవిధమైన కష్టనష్టములు ఎవరు కలిగించిననూ, వారికి మరణదండన విధించబడును. ఆయనపై అసత్య వ్యతిరేక ప్రచారము గావించిన వారి నాలుకలు కత్తిరించబడును. యువాన్ చాంగ్ బోధనలు విని తరించదలుచుకొన్నవారికి మాత్రము ఈ శాసనము ఎటువంటి అపకారమును జేయదు!''

ఈ ఆదేశఫలితముగా యువాన్ చాంగ్ ప్రతికక్షులు అనతికాలముననే అదృశ్యమైపోయిరి.

టిబెట్ దేశమునకు చెందిన బౌద్ధ చరిత్రకారుడు హర్షుడు విదేశీయ మతముల విషయములో అవలంభించిన వైఖరిని గురించి ఒక దారుణ విషాదగాథను వివరించుచున్నాడు.

విదేశీయ మతములకు చెందిన అనేకులైన పండితులు మత ప్రచారమునకై భారతదేశము దర్శించిరి. హర్షవర్ధనుడు ముల్తాన్ అనుచోట వీరికొక గొప్ప ఆరామము నిర్మిం

చెను. విదేశీ మతప్రచారకులందరకూ, ఆ భవనమున కొన్ని నెలలపాటు ఆతిథ్యమిచ్చెను. ఒకనాడు ఆకస్మికముగా హర్షుడు ఆ భవన ద్వారముల బంధించి, దానిని తగులబెట్టించెను. ఆ భవనముతోపాటు అందు బంధించబడియున్న వేలాది విదేశీయ మతప్రచారకులు భస్మమైపోయిరి.

కనూజ్‌లో హర్షుడు ఏర్పాటుచేసిన బౌద్ధమత పరిషత్తు చరిత్రాత్మకమైనది. మన దేశమును పరిపాలించిన ప్రముఖ బౌద్ధ చక్రవర్తులు ఇట్టి బౌద్ధ సభలను ఏర్పాటు చేయుచునేయుండిరి. అశోకుడు పాటలీపుత్రమున, కనిష్కుడు కాశ్మీరమున బౌద్ధమహాసభల జరిపించెను. హర్షవర్ధనుడు మాత్రము ఇందుకై తన రాజధానీ నగరమునే ఎన్నుకొనెను.

ఈ బౌద్ధ మహాపరిషత్తును గురించి యువాన్ చాంగ్ విపులముగా వర్ణించియుండెను. బౌద్ధమతమును ప్రచారము చేయుటయే ఈ పరిషత్తు నేర్పాటుచేయుటలోగల ఆశయము. గంగానదికి దక్షిణ తీరమున సభావేదిక సర్వాలంకారశోభితముగా నిర్మించబడెను. కామరూప రాజ్యాధీశుడు కుమార ప్రభువు, బౌద్ధపండితులు, ఉన్నతోద్యోగులు తోడురాగా, హర్షుడు సభావేదికను సమీపించెను. అచ్చట అల్లుడైన వల్లభిరాజు, అనేకులైన సామంతులు, మతాచార్యులు హర్షుని ఆహ్వానించిరి. ఇరవైమంది సామంతరాజులు, నాలుగువేలమంది మహాపండితులైన బౌద్ధ భిక్షువులు, మూడువేల జైనమత పండితులు, బ్రాహ్మణులు పరిషత్తునకు హాజరైరి.

గంగానదీ తీరమున బ్రహ్మాండమైన ఒక నిర్మాణము ఈ ఉత్సవములకు కేంద్రమైనది. అందు హర్షుని యంత బంగారు బుద్ధవిగ్రహము నిర్మింపబడి ప్రతిష్ఠింపబడెను. అదే మాదిరి చిన్న పరిమాణముగల వేరొక బుద్ధవిగ్రహమును ఏనుగుపైనుంచి, ముందు ఊరేగింపు జేసిరి. ఆ ఏనుగు వెనుక మూడువేల ఏనుగులు బయలుదేరినవి చక్రవర్తి సామంతరాజులు, బౌద్ధ, జైన, బ్రాహ్మణ పండితులు వెంబడించిరి. చక్రవర్తి ఈ ఊరేగింపునందు బంగారుపుష్పములను ముత్యములనూ చల్లుకొనుచు పోయెను ఆ తరువాత చక్రవర్తి పరిషత్తుకు హాజరైన వారందరకు గొప్పవిందునొకదానిని గావించెను. విందైన పిదప మహాపరిషత్తు ప్రారంభమాయెను. కార్యక్రమమంతయు మహాయాన సాంప్రదాయ ప్రకారము జరిగెను. ఈ పరిషత్తునకు యువాన్ చాంగ్‌ను హర్షుడు అధ్యక్షునిగా చేసి గౌరవించెను.

ఈ ఉత్సవముల సందర్భములో హర్ష చక్రవర్తి స్వయముగా ఇంద్రుని వేషము ధరించి, బుద్ధుని విగ్రహమునకు ఛత్రము పట్టుచూ నూరేగెను. మహాసభలలో అధ్యక్షులు యువాన్ చాంగ్ మహాయాన మతసిద్ధాంతముల గురించి ప్రసంగించెను. చక్రవర్తి శిబిరము వేదికకు మైలుదూరమున నిర్మింపబడియుండెను. సాయంకాలమువరకు ఈ సభలందు పాల్గొని రాత్రికి శిబిరమునకు జేరెడివాడు.

ఈ కనూజి సభలో బౌద్ధమతమునకు జరిగిన గౌరవము అపూర్వమై, అనన్యమైయుండెను. ఇది శ్రోత్రియ బ్రాహ్మణులకు అసూయ కలిగించెను. అనేక దినములు మహావైభవముగా జరిగిన ఈ సభలు విషాదకరమైన సంఘటనలతో ముగిసినవి. గంగానదీతీరమున నిర్మించబడిన ఆరామములకు నిప్పు పెట్టబడినది. ఆ తరువాత హర్షుడు సపరివారముగా నొక స్థూపము నధిరోహించి, మహాసభ దృశ్యముల పరికించుచుండగా, ఒక దుండగీడు బాకును చేగొని చక్రవర్తిని చంపుటకు ఆతనిపై కురికెను. కాని అదృష్టవశమున చక్రవర్తికి ప్రమాదము జరుగలేదు. ఆ దుండగీడు బంధించబడి చంపబడెను. కొందరు శ్రోత్రియ బ్రాహ్మణులు తమకంటె యధికముగా బౌద్ధభిక్షువుల చక్రవర్తి గౌరవించుచున్న నేరమునకు ఆగ్రహమునొంది, హర్షుని చంపుటకు ఆ దురదృష్టవంతుని నియోగించిరి. ఈ ఉదంతము తెలిసినంతనే హర్షుని సైనికులు అయిదువందలమంది బ్రాహ్మణులను బంధించిరి. ఆ తరువాత జరిగిన విచారణలో వారు తమ నేరముల నంగీకరించక తప్పలేదు. ఈ హత్యానేరమునకు సంబంధించిన వారందరికీ మరణదండనము విధించబడెను. వందలాది బ్రాహ్మణులు దేశమునుండి బహిష్కరించబడిరి.

కనూజ్ పరిషత్తు ఈవిధముగా ముగిసినపిదప హర్షుడు యువాన్ చాంగ్‌తో గలసి ప్రయాగకు బయలుదేరెను.

దీనినే అలహాబాదు యందురు. ఇచ్చటనే గంగా యమునా సరస్వతీనదులు పవిత్రసంగమము జరిగినది. ఇది హిందువులకు గొప్ప పుణ్యక్షేత్రము. ఇచ్చట స్నానమాచరించిన సర్వ పాపపరిహారము జరుగునని హైందవుల విశ్వాసము.

అట్టి పవిత్ర దేశమున అయిదేండ్లకొకసారి శ్రీహర్షుడు గొప్ప మహోత్సవము నొకదానిని చేయుచుండెడివాడు. ఈ అయిదు సంవత్సరములలో తన ధనాగారమున ప్రోగుపడిన ధనమంతయు చక్రవర్తి హీనులకు, దీనులకు, బీదసాదలకు పంచిపెట్టుచుండెడివాడు. ఇట్టి యుత్సవములలో ఆరవదానిని యువాన్ చాంగ్ దర్శించెను. రెండునెలల పదిహేనురోజులు మహావైభవముగా ఈ ఉత్సవము జరిగినది. దూర దేశముల నుండి, దేశాంతరములనుండి మహాపండితులెందరో ఈ ఉత్సవమున కాహ్వానించబడిరి. సుమారు అయిదులక్షలమంది ప్రజలు దానిని దర్శించుటకు హాజరైరి. అప్పటికే హిందూ దేశమునకువచ్చి చిరకాలమైయుండుటచే, మాతృదేశమునకు పోవలయునని తొందరపడుచున్న యువాన్ చాంగ్ ఈ ఉత్సవవైభవమును జూచి తన ప్రయాణమును వాయిదా వేసికొనెను.

మొదటిరోజున ప్రత్యేకముగా నిర్మించబడిన ఆలయమున బుద్ధుని బంగారు ప్రతిమ ప్రతిష్ఠించబడినది. రెండవ దినమున హర్షుని కులదైవమైన సూర్యుని విగ్రహము, మూడవరోజున శివుని విగ్రహము ప్రతిష్ఠించబడెను. నాల్గవ

దినమున .పదివేల బౌద్ధభిక్షువులకు దానధర్మములు ప్రత్యేకముగా జరుపబడినవి. తరువాత ఇరవై రోజులవరకు బ్రాహ్మణులకు భూరి సంభావనలీయబడినవి. చివరకు ఒక మాసము రోజులపాటు బీదలకూ, అన్నార్తులకూ దానములీయబడెను. ఈ దానధర్మములతో అయిదు సంవత్సరములుగా కూడబెట్టబడిన చక్రవర్తి ధనాగారమంతయు ఖాళీయైపోయెను. చివరకు చక్రవర్తి తాను ధరించిన రాజలాంఛనములను, ఆభరణములను, కట్టుబట్టలనుగూడ దానమిచ్చి, సోదరియైన రాజ్యశ్రీవద్ద ఒక చిన్న అంగవస్త్రమును భిక్షగా అర్థించి పుచ్చుకొని ధరించెను.

ఈ మహోత్సవమగుసరికి దేశమును రక్షించుటకు శాంతిబద్రతలు కాపాడుటకు అవసరమైన గజతురగ కాల్బములుదప్ప, దక్కిన సిరిసంపదలన్నియు అదృశ్యమైపోయెను. ఈరీతి ధనహీనుడై చెల్లెలిచ్చిన అంగవస్త్రమును జుట్టుకొని, హర్షుడు బుద్ధదేవుని పూజించెను. ఇట్టి వితరణ శీలము ప్రపంచ చక్రవర్తులలో ఎచ్చటనూ గానరాదు.

ఈ మహోత్సవము క్రీ. శ. 644 సంవత్సరము ఏప్రియల్ మాసాంతమునకు సమాప్తమయ్యెను.

ఇప్పుడు మాతృదేశమునకు పోవలయునని తొందరపడుచున్న యువాన్‌చాంగ్‌కు చక్రవర్తి యనుజ్ఞనొసంగెను. కామరూప ప్రభువు చీనాయాత్రికునకు అశేష ధనరాసులను కానుకగాయిచ్చెను. కాని యువాన్‌చాంగ్ ఆ

ధనమును స్వీకరించుట కంగీకరించలేదు. తిరుగు ప్రయాణమునకు అత్యావశ్యకమైన కొద్దిమొత్తము గ్రహించుటకు మాత్రమాతడంగీకరించెను. యువాన్‌చాంగ్‌కు ఒక ఏనుగు బహూకరించబడినది. దేశ సరిహద్దులవరకూ యువాన్‌చాంగ్‌ను సురక్షితముగా గొనిపోవుటకు యుధితుడను సామంతుని హర్షుడు నియోగించెను. ఆరునెలలు ప్రయాణము సాగించి యుధితుడు యువాన్‌చాంగ్‌ను తూర్పుపంజాబ్‌లోని జలంధర్ జేర్చెను. జలంధర్‌లో యువాన్‌చాంగ్ ఒక మాసమురోజులు విశ్రాంతి గైకొనెను. ఆ తరువాత తిరిగి ప్రయాణముసాగించి, పామీరు, కోతానులగుండా క్రీ. శ. 645 సంవత్సరమున వసంతకాలమునాటికి ఆతడు మాతృదేశమున కడుగుపెట్టెను.

యువాన్‌చాంగ్ శుష్కహస్తములతో మాతృదేశమునకు తిరిగిపోలేదు. మార్గమధ్యమున అనేక దొంగతనములకూ, దోపిడీలకూ గురియైనప్పటికీ, సుమారు 675 బౌద్ధమతగ్రంథములను, బుద్ధుని అస్థికలను మాతృదేశమునకు జేర్చగలిగెను. యువాన్‌చాంగ్ తన శేషజీవితమునంతనూ తాను గొనిపోయిన గ్రంథములను, మాతృభాషలోనికి అనువదించుటయందు గడిపెను. క్రీ. శ. 661 నాటికి అరవైనాలుగు గ్రంథముల నాతడు రచించగల్గెను. ఆ తరువాత కొన్ని సంవత్సరములు పరిపూర్ణ శాంతి సౌఖ్యములతోనూ, తన జీవితము సార్థకమైనదను సంతృప్తితోనూ జీవించి, క్రీ. శ. 664 లో ఇహలోకయాత్ర చాలించెను.

హర్షుని కాలములో భారత చైనా దేశములకు అత్యంత సన్నిహితమైన స్నేహబంధము లేర్పడెను. క్రీ. శ. 641 లో హర్షుడు ఒక బ్రాహ్మణుని రాయబారిగా చైనా చక్రవర్తి కడకు బంపెను. అతడు రెండు సంవత్సరములకు అనగా క్రీ. శ. 643 లో భారత దేశమునకు తిరిగివచ్చెను. చైనా చక్రవర్తి రాయబారమునకు సమాధానముగా బ్రాహ్మణుని వెంట భారత దేశమునకు ఒక చైనా రాయబార వర్గమును బంపెను. ఈ రాయబార వర్గము సుమారు రెండు సంవత్సరములపాటు భారత దేశమునందుండెను.

ఆ తరువాత క్రీ. శ. 645 లో చైనా చక్రవర్తి 'వాంగ్ హూయన్ చి' అనునాతని నాయకత్వమున మరియొక రాయబార వర్గమును భారత దేశమునకు బంపెను. ముప్పై మంది అశ్వారూఢులైన చైనా సైనికులు 'వాంగ్ హూయన్ చి' వెంట భారత దేశమునకు వచ్చిరి. కాని ఈ రాయబార వర్గము భారత దేశమునకు జేరకముందే హర్షుడు పరలోకగతుడయ్యెను.

హర్షుడు మరణించిన సంవత్సరము గురించి రూఢి అయిన సమాచారము లేదు. అతడు క్రీ. శ. 648 సం॥ర పూర్వమే మరణించి యుండవచ్చును.

హర్షుని యనంతరము ఆ సామ్రాజ్యము శీఘ్రకాలములో విచ్ఛిన్నమైపోయెను. దేశమున కరువు కాటకములు విజృంభించెను, అరాచకము ప్రబలెను. హర్షుని తదుపరి

రాజ్యమునకు వచ్చుటకు తగిన వారసుని యాతడు నియమించ లేదు. ఆ అవకాశమును తీసుకొని హర్షుని మంత్రులలో నొకడైన అర్జనుడనువాడు, సామ్రాజ్యము నపహరించి కనూజి సింహాసనము నధిష్టించెను.

అర్జునుని కాలములో భారత దేశమును దర్శించిన చైనా రాయబార వర్గమును యాతడు అవమానించి తిరుగగొట్టెను. అట్లుగాక ఆ రాయబార వర్గములోని వారినందరనూ చెరబట్టి, చిత్రహింసలకు గురిచేసి యాతడు చంపెనని మరియొక గాథ. ఏమైననూ ఈ రాయబార వర్గ నాయకుడెటులనో ప్రాణములతో బయటపడి నేపాళమునకు పారిపోయి, అటనుండి టిబెట్ రాజును కలుసుకొని, తనకు జరిగిన పరాభవమును విన్నవించుకొనెను. అప్పుడు టిబెట్ను పరిపాలించుచున్న రాజు పేరు 'సాంగ్ జాన్ గాంపో' అనునాతడు. ఈతడు చీనా రాజకుమారిని పెండ్లాడెను. తన మామయైన చైనాచక్రవర్తి రాయబారవర్గమునకు సంభవించిన పరాభవమునకు అతడుగ్రుడై, వేయి అశ్వదళమును, నేపాళమునకు చెందిన ఏడువేల కాల్బలమును 'వాంగ్ హుయాన్ చి' కిచ్చి బంపెను.

ఈ చిన్న సైన్యమును వెంటబెట్టుకొని 'వాంగ్ హుయాన్ చి' భారత దేశమున ప్రవేసించెను. అర్జనుడు ఓడి పారిపోయి, తిరిగి సైన్యముల గూర్చుకొని, వాంగ్ హుయాన్ చిని ఎదిరించెను. కాని ఈ పర్యాయముగూడ అర్జనునకే

పరాజయము ఘటిల్లినది. వాంగ్ హుయాన్ చి వేయిమంది బంధితులను చిత్రవధ జేసెను. తరువాత రాజకుటుంబమును, సుమారు పదివేల శత్రుసైన్యములను బంధించెను. 580 పట్టణములు చైనావీరునకు లొంగినవి. తూర్పు భారతమును పాలించుచున్న కుమారప్రభువు చైనాసేనలకు కావలసిన సరఫరాలను జేసెను.

వాంగ్ హుయాన్ చి అర్జునుని చెరబట్టి చైనాగొని పోయి చక్రవర్తి పాదములపై విసరెను. ఈ ఘన కార్యము సాధించినందులకు చైనాచక్రవర్తి వాంగ్ హుయాన్ చిని విశేషముగా గౌరవించి ఉన్నతపదవి నిచ్చెను. వాంగ్ హుయాన్ చి తిరిగి క్రీ॥ శ॥ 657 లో బౌద్ధపుణ్యక్షేత్రముల దర్శించుటకు భారత దేశమునకు వచ్చెను. కాని అప్పటికి భారత దేశ రాజకీయ ఐక్యత పూర్తిగా విచ్ఛిన్నమైయుండెను.

హర్షుని మరణముతో భారతదేశ వైభవము తిరిగి తిరోగమించసాగెను. సిరిసంపదలతో తులతూగుచున్న భారత దేశమును జయించుటకు సర్వసిద్ధముగానున్న దురాక్రమణ దారుల బారినుండి హర్షుడు భారతదేశమును రక్షించి, దేశమున శాంతిభద్రతలస్థాపించెను. కాని ఆతని మరణముతో ఆర్యావర్తమున తిరిగి రాజకీయ సంక్షోభములు బయలు దేరెను.

హర్షుని కాలమునాటి సాంఘిక - ఆర్థిక పరిస్థితుల గురించికూడ కొంత ముచ్చటించుకొందము.

సంఘము చాతుర్వర్ణ వ్యవస్థపై నిర్మింపబడియుండెను. బ్రాహ్మణ క్షత్రియులు ఉన్నతవర్ణములకు చెందినవారుగా పరిగణింపబడుచుండిరి. ప్రజలందరిలోను, బ్రాహ్మణులు మిక్కిలి సుచిగానుండి, పవిత్రమైన జీవితముల గడుపుచుండిరి. వర్ణాంతర వివాహములు ఆనాడు కొనరావు. వివాహ భోజన సందర్భములలో కొన్ని విబేధములున్నను, సాంఘిక వ్యవస్థ నందు అధిక సామరస్యము కనిపించెడిది.

ప్రజలందరూ చాల సుచియైన జీవితముల గడుపుచుండిరి. ఒడలంతయు నీటితో శుభ్రపరచుకొనని దే వారు ఆహారమును ముట్టెడివారు కాదు. ఒకరి ఎంగిలి ఒకరు అంటరు. ఒకరి పాత్రల నొకరు వాడరు. విరివిగా పాలు, నేయి, పంచదార, రొట్టె మొదలైన ఆహార పదార్థములు వాడబడుచుండెను. అప్పుడప్పుడు మాంసము, చేపలుకూడ ఆహారమున జేర్చుటగలదు. కాని రాజమందిరములలో పర్వదిన సందర్భములలో మిక్కిలి అసభ్యకరమైన వినోదక్రీడలు జరుగుచుండెను. హర్షుని జన్మదిన సందర్భమున అనేక వేడుకలు ఏర్పాటుచేయబడినవి. త్రాగి ఒడలు తెలియని స్త్రీలు అర్ధనగ్న శరీరములతో, విచ్చలవిడిగా విహరించుచూ, నాట్యములు చేయుచుండిరి. వృద్ధురాండ్రుకూడ సిగ్గువిడచి గంతులు వేయసాగిరి. వృద్ధులైన పెద్దలుకూడ సురపానము జేసినట్లు కేకలువైచుచుండిరి.

వసంతోత్సవములందు గూడ ఇదే విధమైన విశృంఖలత్వముతో ప్రజలు విజృంభించుచుండిరి. బాణుడు ఈ విషయములను వివరముగా వర్ణించెను. ఇందు కొన్ని అతిశయోక్తులుండవచ్చును కాని, అతిశయోక్తికిగూడ యదార్థవిషయములే ఆధారములు గదా? ఒక్కవిషయము మన మూహింపవచ్చును. హర్షుడు చివరి రోజులలో ఈ అసభ్య వర్తనలను నిస్సంశయముగా నిషేధించియుండును.

ఆ రోజులలో స్త్రీలకు ఘోషాపద్ధతిలేదు. ఉన్నత కుటుంబములకు చెందిన స్త్రీలు ఉన్నతవిద్యల నభ్యసించుచుండిరి. లలితకళలనుగూడ వారు అభ్యసించెడివారు. ప్రభాకరవర్ధనుడు కుమార్తె రాజ్యశ్రీకి సంగీతము - నాట్యము నేర్పుటకు మహాపండితుల నియమించెను. స్త్రీలు చిత్రలేఖనమందుగూడ ఉత్సాహము చూపుచుండెడివారు. రత్నావళి నాటకమున కథానాయకి తన ప్రియుని రూపమును స్వయముగా చిత్రించుకొనెను. అతి బాల్యముననే స్త్రీలకు వివాహములు గావింపబడుచుండెను. రాజ్యశ్రీ పుష్పవతిగాక పూర్వమే ఆమెకు వివాహము జరిగినది. దీనిఫలితముగా స్త్రీలనేకులు అకాలముననే భర్తల కోల్పోయి వితంతువులై నాటి ఆచారము ప్రకారము సహగమనమొనర్చి, అగ్నిదేవునికి ఆహుతియై పోవుచుండిరి. హర్షవర్ధనుని సోదరి ఈ ఆచారము ప్రకారమే, భర్త మరణించిన తరువాత ఆత్మహత్య కొడిగట్టినది. అదృష్టవశమున హర్షునిచే రక్షింపబడినది. హర్షుని తల్లి యశోవతి భర్తయైన ప్రభాకరవర్ధమానునితో గలసి సహగమనము జేసినది. సహగమనమును నివా

రించుటకు హర్ష వర్ధనుడు ప్రయత్నించెను గాని, మహాపతి వ్రతయైన యశోపతి 'నాయనా! నేను నేడు మరణించుట ఆచంద్ర తారార్కముగా జీవించుట కే! భర్త మరణించిన తరువాత భార్యపొందు వియోగాగ్ని ముందు ఈ అగ్ని అమృత తుల్యమురా తండ్రీ!' అని కుమారుని కౌగలించుకొని, ముద్దిడి సరస్వతీ తీరమునకు సపరివారముగా నడచి వేలాది ప్రజలముందు కన్నకుమారుని సమక్షమున అగ్నిలో కురికినది.

హర్షుని కాలములో సముద్రయాత్రలు విరివిగా జరుగుచుండెను. క్రీ॥ శ॥ 641 లో హర్షుడు ఒక బ్రాహ్మణుని చైనాచక్రవర్తికడకు రాయబారమంపగా అతడు సముద్ర మార్గముననే ప్రయాణముచేసి వచ్చెను. ఆ సముద్రమార్గము గుండా అనేక వర్తక వాణిజ్యవర్గములు, రాయబారవర్గములు, యాత్రికులు ప్రయాణము సాగించుట జరిగినది. నాటి మన ఓడరేవులలో తామ్రలిప్తి ప్రసిద్ధమైనది. ఈ రేవు గుండానే రెండవ చంద్రగుప్తుని కాలమున ఫాహియాన్ అను చీనాయాత్రికుడు మన దేశమునకు వచ్చెను. హర్షుని కాలములో భారతీయ నాగరికత – సంస్కృతి విదేశములకు విరివిగా వ్యాపించినది. యువాన్ చాంగ్ భూమార్గమున భారత దేశమునకు వచ్చిపోయిన సందర్భమున, మార్గ మధ్యమునగల దేశములన్నింటిలో భారతీయ సంస్కృతీ ప్రభావము కనిపించినదని వర్ణించియుండెను.

హర్షుని కాలములో భారత దేశ సాభాగ్యముగూడ అనల్పముగా వృద్ధిజెందినది. హర్షుని కాలముననే అనేక క్రొత్త

నగరములు ఉద్భవించినవి. ఈ నగరములే నాటి భారత సౌభాగ్యమునకు కేంద్రములైనవి. చిరకాలము ప్రముఖస్థాన మాక్రమించిన పాటలీపుత్ర నగరప్రాముఖ్యత కొంత తగ్గి, దాని స్థానమును గంగానదీతీరమున విరాజిల్లిన కనూజ్‌కు లభించినది. బ్రాహ్మణ బౌద్ధమతములు ఆ నగరమున సమానముగా వెల్లివిరిసియుండెను. తరువాత భారతదేశమున ప్రాముఖ్యత సంపాదించిన నగరము ప్రయాగ, మథుర, స్థానేశ్వరము, మటిపురము, మయూరము, గోవిసాన, అహిచ్ఛత్ర, అయోధ్య, కోశాంబి, విశోక, వారణాసి, చంప, రాజమహాల్, పుణ్యావర్ధన, సామతట, తామ్రలిప్తి మొదలైన అనేక నగరములు మహోన్నతదశ ననుభవించుచున్నవి. ఈ నగరములన్నియు చక్కని పథకముల ప్రకారము సుందరముగా నిర్మించబడినవి. నగరముల చుట్టును బలమైన ఎత్తైన గోడలు నిర్మించబడియుండెను. తాలారులు పల్లీయులు, పాకీవారు, కసాయివారు - వీరందరూ నగరము వెలుపలనే నివసించెడివారు. కులవృత్తులు గౌరవించబడుచుండెను. దేశీయ, విదేశీయ వర్తకమంతయు వైశ్యులు నడుపుచుండిరి. వ్యవసాయము, పరిశ్రమలు శూద్రుల చేతులయందుండెను. నీటి సరఫరాకు తులాయంత్రమనబడు పంపు వాడబడుచుండెను. బ్రాహ్మణులకు మాత్రము ఈ లౌకిక వృత్తులతో ఎక్కువ సంబంధము లేకుండెను. పరిశ్రమలలో అత్యంత ప్రశంసనీయమైన కళానైపుణ్యము ప్రదర్శింపబడుచుండెను. అస్సామురాజు హర్షవర్ధనునకు వజ్రములతో పొదుగబడిన ఛత్రమును బహూకరించెనట! మృణ్మయ

పాత్రలపై గూడ సుందరమైన శిల్పచాతుర్యమును ప్రదర్శించు చిత్రములు గీయబడెడివట!! లోహములతో అపూర్వ సౌందర్యకాంతుల విరజిమ్ము ప్రతిమలు చెక్కబడెడివట! హర్షునికాలములో మారకద్రవ్యముగా వెండిబంగారములే గాక, ముత్యములుగూడ వాడబడుచుండెను.

హర్షునికాలమున గుప్తులనాటి కళలు పరిపూర్ణ రూపము ధరించినవి. భారత సామ్రాజ్య వైభవము కడసారిగా విరియబూసినది.

పృథ్వినేలిన ప్రముఖ చక్రవర్తులలో హర్షవర్ధను డొకడు. ఆ మహాపురుషుడు దైవస్వరూపుడేమోనని భ్రాంతి కలుగుచుండును. ఆతడు మహాచక్రవర్తి మాత్రమేగాదు, మహాకవిపుంగవుడుగూడ! ఆతడు మహాయోధుడు మాత్రమేగాదు, చిరస్మరణీయమైన సాహిత్యమూర్తిగూడ!! కుబేరు డంతటి ఐశ్వర్యవంతుడుగాదు, కుచేలునంతటి దరిద్రుడుగూడ! పార్థునితో పోల్చదగిన వీరుడు – కర్ణునితో సరితూగగల దానశీలుడు – ధర్మరాజును జ్ఞప్తికిదెచ్చు ధర్మమూర్తి.

నాటి రాజకీయపరిస్థితులు అతనిచే కత్తిబట్టించి, కదనరంగమున కురికించినవి. కాని అనతికాలముననే అతడు ఖడ్గమును విసర్జించెను. ధర్మపరిపాలనా కంకణమును ధరించెను.

మహాసామ్రాజ్య నిర్మాతగా, పరిపాలనా దక్షుడుగా, మతపోషకుడుగా, కళోద్ధారకుడుగా, సాహిత్యసామ్రాట్టుగా హర్షవర్ధనుడు భారతదేశ చరిత్రలో చిరస్మరణీయుడయ్యెను.

# బాల సాహిత్యము

విజయ విలాసము
ప్రభావతీ ప్రద్యుమ్నము
హర విలాసము
విప్రనారాయణ చరిత్ర
నీలాసుందరీ పరిణయము
పారిజాతాపహరణము
పాండురంగ మాహాత్మ్యము
వీరభద్ర విజయము
వసుచరిత్ర
కాశీ ఖండము
భీమఖండము
ఆముక్తమాల్యద
వేణీ సంహారము
శంకరాచార్య కథలు
కాదంబరి కథ 1, 2 భా.
కమల కథ
విచిత్ర కథలు
మాలతీ మాధవము
వినోద కథలు
జైమిని భారతము
ధర్మదేవత
స్వప్నవాసవదత్తము
ప్రియదర్శిక
పైవి ఒక్కొక్కటి రు. 0_10_0
అశోకుడు
కనిష్కుడు
మనుచరిత్ర

ఉత్తర రామాయణము 1,2 భా.
చంద్రభాను చరిత్ర
బాల దర్శిని
అడగండి చెబుతాను 1, 2 భా.
పిల్లల నాటికలు 1, 2 భా.
తమాషా కథలు
జలసింహ
హర్షవర్ధనుడు
పైవి ఒక్కొక్కటి రు 0_12_0
నాగానందము
దశకుమార చరిత్ర
చిరంజీవి
జానపద కథలు 1 to 4 భా.
నీతిసుధ 1 to 3 భా.
వీరసింహ
రాజసింహ
అజాత శత్రువు
పైవి ఒక్కొక్కటి రు 0_8_0
కళా పూర్ణోదయము 1_0_0
భోజరాజీయము 1_0_0
విక్రమార్కచరిత్ర 1_0_0
కులాసా కుటుంబము 1_0_0
మన పండుగలు 1_4_0
స్నేహఫలము 1_4_0
పేదరాశిపెద్దమ్మ కథలు 1,2,3 భా.
ఒక్కొక్కటి రు 1_0_0
ఈసప్ కథలు 1_8_0

**ఉమా పబ్లిషర్స్, విజయవాడ-1**

Vuma Printers, Main Bazaar, VIJAYAWADA-1.